# కథాగేయ సుధానిధి

(ఈసప్ కథలు)

నండూరి రామమోహనరావు

ప్రచురణ:

**నవీన గ్రంథమాల, విజయవాడ-2.**

ప్రథమ ముద్రణ:
నవంబరు 1962.

ఈ గేయాలను తమ ఆంధ్ర సచిత్రవార పత్రికలో 1955 వ సంవత్సరంలో వరసగా వారం వారం ప్రచురించిన శ్రీ శివలెంక శంభుప్రసాద్ గారికి రచయిత కృతజ్ఞత.

వెల: 1-75

రాజా ప్రెస్,
విజయవాడ-1

# పరిచయం

అందమైన పలుకుబడిమీద అద్భుతమైన పలుకుబడి గల రామమోహనరావుగారి కవిత్వం అరుదైనది. ఆయన పద్యాలలో, పాటలో చదువనివారూ, గిట్టనివారూ, ఇతరులూ కూడా ఒక విధంగా కాకపోతే మరోవిధంగానైనా ఈమాట ఒప్పుకు తీరాలి. కారణం:

ఈ పలుకుబడి పంతులుగారికి తీరుబడిలేక - ఆయనే అన్నట్లు - బొత్తిగా నిర్వ్యా రామమోహనరావుగా ఉంటున్నందువల్ల ఈయన బహు అరుదుగా రాస్తాడు. అందువల్ల కూడా ఆయన కవిత అరుదైనదే.

మొత్తంమీద ఈ అరుదు బిరుదు మగడు రామమోహనరావుగారికలంలోంచి పైలట్, క్వింక్, ఐరిస్, ఆంధ్రపత్రిక, రెడ్, బ్లూ సిరాలతోపాటు ప్రవహించిన ముత్యాల వంటి అక్షరాలూ, సత్యాలవంటి వాక్యాలూ, లేత తమల పాకుల్లా కోమలమైనపద్యపాదాలూ అక్షరాలా అక్షరాలు. రాజకీయ గేయరచనా వ్యాసంగరంలో "సవ్యసాచి" గా ఆయన "అక్షరతూణీరం" ప్రయోగించిన శరాక్షరాలు రామ్మోహనాస్త్రాలై 'గురు' ప్రశంస లందుకున్నాయి.

పంచతంత్రచిత్ర కథలకు ఆయనమలచిన పద్యాలలో, ఈసప్ కథలను సాధించితీసిన కథాగేయ సుధానిధిలో-ఆయన కలం-కారీతనం పసిపిల్లలకు కూడా ఉత్తేజం కలిగిస్తుంది.

రేసు గుర్రాలు, భాంగ్రా డాన్సులు, అభినయం యిష్టమైనా వెళ్లే తీరికా ఓపికా లేని కొందరు ఈ పద్యాలు చదివాక పై వాటికేసి వెళ్లడం మానేశారని ఒక చమత్కారి అన్నాడు.

ఈ తరం తెలుగు రచయితలలో చమత్కారిదారిలో నడచిన తొలిబాటసారులు శ్రీశ్రీ, పఠాభి, ఆరుద్ర వంటి ముగ్గురు నలుగురిలో రామమోహనరావుగారు ఒకరిద్దరు.

ఈ పుస్తకంలో పద్యాలు పిల్లలకోసమని ప్రచురణ కర్తలు ఎలాగూ చెబుతూనేఉన్నారు. కాని పసివాళ్ళు కాని వాళ్ళు ఆస్వాదించవలసిన అందచందాలు ఇందులో పుష్కలంగా ఉన్నాయని చదివిన వారందరికీ తెలుసు.

చదివినవారితో ఈ చక్కని పద్యాలగురించి సరదాగా మాట్లాడుకోవడం, చదవని కొద్దిమందిని ఊరించడం ఈ వాక్యకారుడికి సరదా కాబట్టి - పసిపిల్లలికి పద్యాలే తప్ప వాటిమీద అభిప్రాయం అందనివ్వకూడదు కాబట్టి - గడుసుగా ఇంతపొడుగాటి వాక్యాలు రాయటం జరిగింది. అంతే తప్ప కావ్య నిదానం చేసే స్తోమత, అర్హత ఉన్నాయని మాత్రం కాదు.

ముళ్లపూడి వెంకట రమణ.



# ఈసప్ కథ

గ్రీసుదేశమందు కలడు
ఈసప్ అను బానిసీడు.
ఏసుక్రీస్తువలెనె వెన్న
పూసవంటి మనసువాడు.

చీమకేని హానిచేయ
చేతులాడనట్టివాడు.
చిలుకలతో, ఎలుకలతో
చెలిమి చేయునట్టివాడు.

వీథినతడు నడచుచుండ
వెంగలియని జనులెల్లరు,
వేషంగుల వేధింతురు
వేడుకకై బాధింతురు.

పిల్లలకత డెదురుపడిన
పిలుతు రతని తాతా! యని;
పిట్టకథలు చెప్పుమనుచు
పీడించుకు తిందు రతని.

ఊరినడుమ చెట్టునీడ
జేరిచెప్పు నతడు కథలు.
దారిబోవు జనులు గూడ
కూరుచుండి వినుచుందురు.

పిట్టలపై, పిల్లులపై,
లొట్టెలపై, నక్కలపై
పెట్టి యతడు నీతిగలవు
కట్టు కథలు చెప్పుచుండు.

## క థా గే య సు ధా ని ధి

దైనందిన జీవితమున
మానవులకు పనికివచ్చు
జ్ఞానమతని కథల పూల
దేనెలటు దాగియుండు.

సమకాల స్థితిగతులను,
సంఘ దురాచారములను,
సంకోచములేక వ్యంగ్య
సరణి విమర్శించు నతడు.

అన్యాయ ప్రవర్తకుల
నధికార మదోన్మత్తుల
నసిధారా నిశితకథల
నవహేళన జేయు నతడు.

ఏసుక్రీస్తు, సోక్రటీసు
ఏగతి మృతి జెందిరట్లె
ఎవరి చేతులందో కడకు
ఈసప్ కడతేరినాడు.

మంచి చెడ్డలందు దక్క
మనుజులంద రొకటేయని
మదినమ్మిన నేరమునకు
మరణశిక్ష పొందినాడు.

సామ్రాజ్యము లంతరించి,
సమ్రాట్టులు సమసిపోయి
శతాబ్దాలు గడచెగాని,
సమసిపోవ దతనికీర్తి.

వారవార మీపుటలో
ధారావాహిక రీతిని
నా రచించు గీతుల కా
ధార మతని పిట్టకథలె.

కలకల లే నగవు లొలుక
కదలిరండు పిల్లలార !
కైకొనుడిది మీ కొరకే
కథాగేయ సుధానిధి!



## కాకి - నక్క

గుట్టుగా నొక కాకి
చెట్టు కొమ్మను కూరు
చుండె నోటను మాంస
ఖండమును గరచుకొని.

అంత నొక జంబుకము
ఆ మాంస ఖండమును
ఎత్తుకొని పోవనొక
ఎత్తుగడ వేసినది.

కాకివద్దకు పోయి
కపటమైత్రి నటించి
కొంటెనవ్వులు ఆపు
కొనుచు పలికిన దిట్లు:

"కాకి బావా! నీదు
కమనీయ రూపమ్ము
కనులార మనసార
కాంచగలిగితి నేడు,

ఎంత చక్కని రూపు!
ఎంత చల్లని చూపు!
నీలమేఘశ్యాము
బోలు దేహము నీది.

# క థా గే య సు ధా ని ధి

కాకి బావా! నీవు
కావుకావని పాట
పాడినపుడెల్ల నే
పరవశింతును సుమా!

కోకిలను తెగమెచ్చు
కొందురీ కవులెల్ల
కాకమా! పాటలో
నీకు నీవే సాటి.

కలము చేబట్టు ప్రతి
కవిగాడు కవి కాడు.
గొంతెత్తు ప్రతిపక్షి
కూత గీతమ్మౌన?

తేనెలూరెడు నీదు
గానమ్ము విన్నంత
తన్మయత్వము కలిగి
జన్మ సార్థకమౌను.

బావ బావా! ఒక్క
భావగీతము పాడి
ఉల్లాసమున నన్ను
ఉయ్యాల లూపవా?"

నక్క మాటలు కాకి
నిక్కమని భావించి
కర్ణ కర్కశముగా
కావుకావని యరచె.

నోరు తెరచిన యంత
జారె మాంసపు ముక్క.
ఒక్క యుదుటున దాని
నొడిసి పట్టెను నక్క.

"పాటతోపాటు సా
పాటు దయచేసితివి;
తన్మయుడనైతి, నా
జన్మతరియించె" నని

నక్క మాంసపు ముక్క
నక్కడే తినుచుండ,
తిక్క కుదిరిన కాకి
బిక్కమొగమేసినది.

♦ ♦ ♦

"కపటమిత్రుల పొగడ్తలు
గడ్డి కప్పిన అగడ్తలు.
నిజమరయక నమ్మినచో
నిలువులోతు దిగబడుదురు."



## డేగ - తాబేలు

చాలకాలము పూర్వము
జలములందలి కూర్మము
చెట్టుపై గల డేగతో
చెలిమి చేసినది.

నింగి మబ్బుల దాకను
నిత్య మెగిరే డేగను
చూచి తాబే లెప్పుడూ
చోద్య మందెడిది.

మేఘమార్గము నందున
డేగలా విహరించిన
ఎంత సుఖమని కూర్మమూ
ఎంచుచుండెడిది.

'డేగ బ్రతుకే మధురము,
డేగ బ్రదుకే సహజము
చెరువుబ్రదుకిది దేని'కని
చింతపొందినది.

"నీకువలెనే ఎగురగ
నాకు పుట్టెను కోరిక;
ఎగురుటెట్లో నేర్పు"మని
ఎంతో వేడినది.

"నీటనుండెడిదానవు
నింగికెట్టులు పోగువు?
ఉన్నచోటే తృప్తితో
ఉండు"మనె డేగ.

"రెక్కలైనా లేకనె
పక్కి సైతము ఎగురునె?
ఎందుకొచ్చిన తిప్ప"లని
మందలించినది.

కాని వదలక పంతము,
శ్యేనమును బలవంతము
కూర్మమెంతో చేసెనూ
కర్మవశమునను.

డేగ అంతా విన్నది,
నీగతింతే నన్నది.
రెండుకాళ్ళతొ పట్టుకుని
రివ్వునెగిరినది.

మింటి మబ్బుల కొసలను
అంటుకొని తాబేలును
'చేతనైనచొ ఎగురు'మని
చెప్పి వదలినది.

కాళ్లు తటపట కొట్టుచు,
కళ్లు తేలగవేయుచు
వెఱ్ఱి తాబే లెక్కడో
గిఱ్ఱుమని పడెను.

చచ్చిపోయెను పాపము
కచ్ఛపమ్మని శ్యేనము
ఎంతగా దుఃఖించినా
ఏమి లాభమ్ము?

♦ ♦ ♦

"తనకు చేతగాని పనులు
తగుదునంచు చేయబూను
మూఢుడెపుడు కూర్మమువలె
కీడు తెచ్చుకొనును గాదె!"



# సింహము - ఎలుగుబంటి

జలజలమని అడవినడుమ పారు
చల్లనిజలములు గల సెలయేరు.
ఎండకాలమందు నొకదినాన
ఎలుగుబంటి యొక్కటి దాహాన

సెలయేటికి నీరు త్రావ నేగ
సింహమొకటి వచ్చె నటకు వేగ.

నిలునిలుమని సింహము గర్జించి
పలికె నెలుగుబంటితో దర్పించి:

"నే నడవికి రాజును గావునను
నేను ముందు త్రాగవలెను."

ఎలుగుబంటి నిర్భయముగ నవ్వి
పలికె కయ్యమునకు కాలుదువ్వి:

"నేను ముందు వచ్చియుంటచేత
నేనె ముందు—నీవే తరువాత."

మాటమీదమాట పెరిగిపోయె,
ఏటియొడ్డు యుద్ధరంగమాయె.

ఘోరముగా నవిరెండును పోరె,
దారుణముగ రక్తనదులు పారె.

కాయమ్ముల గాయమ్ములు తగిలి,
ఆయాసముతోడ మిగుల పొగిలి,

కలహమునవి నిలిపి కొంతసేపు
కలయజూచె తరుశాఖలవైపు.

రాబందులు, డేగలు, కాకులును,
రకరకముల పులుగుల మూకలును,

వృక్షశాఖలెక్కి కూరుచుండి
వీక్షించుచునుండె మొదటినుండి.

ఖగముల గని చీదరించుకొనుచు
మృగరాజనె నెలుగుబంటి గనుచు :

"చూచితివా ఈ పులుగుల తీరు,
చోద్యముగా చూచును మన పోరు.

మనలో నేయొక్కరు మడిసినను
మనమాంసము వీటినోట పడును.

'ఎపుడు చత్తుమా'యని గాబోలు
ఎదురు చూచుచున్నవీ ఖగాలు.

ఇంతబ్రదుకుబ్రదికి తుదకు మనము
ఇట్టులంతమగుట ఏమి ఘనము?

చాల సేపు పోరితి మికచాలు,
ఆల మింక మానుకొనుట మేలు."

నిజమేనని ఎలుగుబంటి అనెను.
నీరుత్రాగి తనదారిని చనెను.

♦ ♦ ♦

ఇరువురు పోరాడు కొనుట
పరులకెపుడు లాభకరము.
కాన విజ్ఞులైన వారు
కలహమునే వర్జింతురు.



## నక్క - ద్రాక్ష పళ్ళు

ఆ వనములో మనము

అడుగిడిన చాలును.

ద్రాక్షఫలములు కొన్ని

లక్ష లగుపించును.

ఎత్తయిన తీగెలకు
గుత్తులుగ కాయును.
ఉయ్యాల లూగి, నో
రూరించి వేయును.

ఆకలితొ నొక నక్క
ఆ యడవి కరిగెను.
స్వచ్ఛమగు ద్రాక్షఫల
గుచ్ఛముల గాంచెను.

చెట్టు చెట్టున కరిగి
లొట్టలది వేసెను.
చెట్టు చెట్టున కెగిరి
పట్టుకో జూచెను.

అందినట్లే అంది
అందకే పోయెను.
ఎంత సేపెగిరినా
ఎగురుటే మిగిలెను.

నక్క అపుడనుకొన్న
దొక్క క్షణమాత్రము!
"ఎంత ఎగిరిన అంద
వేమిటీ చిత్రము?"

పట్టుదల మానుకొని
ఇట్టు లనుకొన్నది:
"అనవసర మీఫలము
లనిపించు చున్నది.

పండు ద్రాక్షలు కావు.
పచ్చివని తోచును.
పుల్లగా నుండు ఈ
పళ్లెట్లు తిందును?"

అని నక్క బింకమున
వెనుదిరిగి పోయెను.
కవియైన పికమొకటి
కాంచె నీవింతను.

ద్రాక్ష ఫలములు మెక్కి
రసమెల్ల గ్రోలెను.
ఎలుగెత్తి యొక గీతి
నీరీతి పాడెను!

"అందినపుడు పచ్చిద్రాక్ష లైనా తియ్యనివే!
అందనపుడు పండు ద్రాక్ష లైనా పుల్లనివే!
అందరాని చందమామ కాసపడగ నేలా ?
అంద రాని అందాలను నిందింపగ నేలా ?
కావ్యరసము వలెనే, ద్రాక్షారసమ్ము కూడా
నేలపడిచి నింగి కెగురు నేర్పరికే గాదా?"

♦ ♦ ♦

అందినపుడు పచ్చిద్రాక్ష
లయినా తియ్యనివే.
అందనపుడు పండుద్రాక్ష
లయినా పుల్లనివే



## చీమ - కుమ్మరిపురుగు

పల్లెటూళ్ళ
పట్టణముల
జనపదముల,
వనపథముల,
ఇచటచటని
ఎన్ననేల ?—
నేల నాల్గు
మూలలందు

చైత్రమాస
చిత్రశోభ
కొల్లలుగా
వెల్లివిరిసె.

అంతసకల
జంతుకోటి
ఆట పాట
లందు మునిగి
కాలమెల్ల
గడుపసాగె.

చీమ యొకటె
ఈ మహోత్స
వానికి దూ
రాన నుండె.

ఒంటరిగా
ఓపికతో

తిరిగి తిరిగి
తిండి గింజ
లేరి ఏరి
చేరవేసె.
తిన్నగ తన
కన్నమునకు.

చీమ తీరు
సోమరియగు
కుమ్మరి పురు
గొకటిచూచి,
హీహీ యని
ఇకిలించెను:

"వెర్రిచీమ!
వెర్రిచీమ !
అందరు ఆ
నందముతో

వేడుకగా
ఆడుచుండ
మూపు పైన
మూటలతో
పాటు పడెద
వేటి కీల్లు?
వెర్రి చీమ!
వెర్రి చీమ!"

చీమ జవా
బే మివ్వక
తన పని పై
తా నేగెను.

♦ ♦ ♦

వర్షఋతువు
వచ్చెనంత
కుంభవృష్టి
కురిసెనంత.

గడగడ చలి
వడకించెను.
గట్టు తెగెను.
చెట్టు పడెను.
చెత్త పోగు
చెదరి పడెను.
వచ్చెనంత
వర్షఋతువు.
మండిపోయె
తిండి కరువు.

తిండి కొరకు
తిరిగి తిరిగి
కుమ్మరి పురు
గుమ్మలించి,
పొట్ట చేత
పట్టుకొనుచు,
చీమయింటి
చెంత కేగి,

"మంచిచీమ !
మంచి చీమ !
ఆకలితో
అలమటించు
మిత్రునకొక
మెతుకు పెట్టి
కనికరమున
గావుమమ్మ!"
అని ఎంతో
అర్థించెను.

అంత చీమ
అన్న దిట్లు:
"ఆ దినమున
ఆడినట్టి
మాటలన్ని
మరచితివా ?

ఆ రోజున
అందలమున
ఊరేగితి
ఏ రోజున
తిరిపెమునకు
తిరుగుచుంటి
వెందులకో
ఎరుగుదువా ?

వసంతఋతు
వసంతమని
ఆ దినమున
అనుకొంటివి.

వర్షఋతువు
వచ్చునసెడి
ఆలోచన
మే లేకను

ఇడుమలిపుడు
పడుచుంటివి.
నేను చూడు
మా నాడే
కూడ బెట్టు
కొనుట వలన
ఏ కష్టము
లేక యిపుడు
ఆనందము
గా నుంటిని.

శ్రమకు సమా
నములేదని,
శ్రమజీవుల
శ్రమ ఫలముగ
అంగారము
బంగారై,
లోకమ్మే
నాకమ్మై

నందనమటు
లందగించు
నంచు తెలియు
మయ్యా నీవు"

అని తన క
ష్టార్జితమున
కొంత తీసి
కుడువబెట్టె.



## సింహము - నక్క

సింహమొక్కటి జంతుకోటిని
సంహరించుచు చాలకాలము
ఎదురులేక నరణ్యారాజ్యము
ఏలి ముదుసలి అయ్యెను.

పారిపోయెడి జంతువులతో
పాటు పరుగెత్తుటకు చాలక
తిండికోసము కాపువేసెను
కొండగుహలో నుండియే.

వ్యాధి యేదో వచ్చి యెంతో
బాధపడుచున్నట్లు మూల్గుచు,
చేరవచ్చెడు చిన్నమృగముల
చీల్చి చంపుచునుండెను.

ఒకదినమ్మున నక్క యొక్కటి
ఉబుసుపోకకు వచ్చి యచటికి
"సింహరాజా ! నమస్కారము,
సేమమా?" యని అడిగెను.

"ఏమిచెప్పుదు నక్కబావా!
ఎన్నిదినములనుండియో, నే
నొడలెరుంగక దిక్కులేనటు
లొంటరిగ పడియుంటిని.

పరామర్శముచేయగా, ఒ
క్కరుండైనను దరికిజేరడు.
జ్వరగ్రస్తుడనైన నన్నే
మరుట మీకిది ధర్మమా?

కాళ్ళు కొంచెము పిసికిపోదువు
గాని యొకపరి దరికి ర"మ్మని
రుద్ధకంఠముతోడ జాలిగ
వృద్ధసింహము పలికెను.

'అమ్మయో, ఈ దొంగమాటలు
నమ్మరా'దని తెలివిగల ఆ
జంబుక మ్మా చుట్టుప్రక్కల
జాగ్రతగ పరికించెను.

కొండగుహకడ సైకతస్థలి
కొన్ని గజములవరకు నున్నది.
నక్కచూడగ నచట కనబడె
పెక్కు అడుగులజాడలు.

జాడలన్నియు సింహముండిన
నీడవైపే పోవుచున్నవి.
మరలివచ్చెడు అడుగుజాడలు
మచ్చుకే నగుపించవు.

"కాళ్ళు పట్టుటకన్న భాగ్యము
కలుగునా ఓ మహారాజా!
కాని చూడుదు మిమ్ము చేరెడు
కాలిజాడల చిత్రము!

కానుపింపదు జాడయొక్కటి
యైన వెనుకకు మరలువైనను.
నరక లోకపుమార్గ మిదియని
నాకు తోచుచు నున్నది.

సేమ మరయగవచ్చు వారిని
ఏమి న్యాయము చీల్చిచంపుట?"
అనుచు జంబుకమచటి నుండియె
వెనుక వెనుకకు మరలెను.

♦ ♦ ♦

"వేయికండ్ల పరికించక
వేయరాదు ముందడుగని
ఈసప్ కథ తెలుపు నీతి
ఎన్నటికిని మరువరాదు."




## గాడిద బ్రతుకు

"పుట్టినదాదిగ
గిట్టెడువరకును
బానిసగానే
బ్రతుకవలెనాకో?

మూటలు, బరువులు
మోయుట తప్పని
గాడిద బ్రతుకిది
బూడిదకాదా ?

ఎందుకు పుట్టితి
నెందుకు బ్రతుకుదు
నెందుకు చత్తునొ
ఎవరికి తెలియును?

ప్రభువుల సేవే
పరమావధియా?
స్వేచ్ఛ లేని ఈ
జీవిత మేలా?"

అని యొక గాడిద
ఆలోచించుచు
ఊరికి వెలుపల
నుండిన పొలమున
కసవును మెల్లగ
మెసవుచునున్నది.

కునుకుచు దాపున
కూర్చునియుండిన

వాడొక రజకుడు,
గాడిద కధిపతి.
అంతట దూరము
నం దరుదెంచెడి
చోరులమూకను
చూచెను చాకలి.

గడగడ భయమున
ఒడలు వడకగా
"గాడిద! గాడిద!
దౌడు తీయుమా!
అరుగో దొంగలు!
అరుగో చోరులు!
తృటిలో వారలు
ఇట కేతెంతురు,
వచ్చినచో నిను
ద్రుచ్చిలి పోదురు.
పరుగున నింటికి
పారిపో"మ్మనుచు

చాకలి ఎన్నో
కేకలు వేసెను.

కదలలేదు ఆ
గాడిద మాత్రము.
కదలక మెదలక
కసవును మెసవుచు
పొలమున నిలబడి
పలికెను గాడిద :

"వెంగలివాడా !
దొంగలు వచ్చిన
నాకా నీకా
నష్టము కలుగును ?
నీకడ చేసెడి
చాకిరి యంతయు
వారి కొనర్పగ
వలెనంతేకద ?

నీ వద్దను నే
బావుకొంటినా?
దొంగలకడ నే
భంగ పడుదునా ?

ఇచ్చటి యూడిగ
మెంతకష్టమో
అచ్చటియూడిగ
మంతే కష్టము.

స్వేచ్ఛలేని జీ
వచ్ఛవమునుకద !
ప్రభువెవడైనను
బానిసనే కద !"



# కుందేలు - తాబేలు

శరవేగమును మించి
పరుగెత్తు కుందేలు,
అడుగులో అడుగుతో
తడబడెడు తాబేలు

పరుగులో తమకేరు
సరివారు లేరనుచు
ఉబుసుపోకకు పందె
మొకసారి వైచినవి.

44... ...

ఈ చివరనుండి అటు
ఆ చివరవరకు వన
పథమందు శీఘ్రముగ
పరుగిడినవారె రః
పందెమందున గెలుపు
పొందినట్లగు సనెపు
బాసతో నవిరెండు
పరుగెత్త సాగినవి.

కుందేలు రభసమున
కొంతదూరము పోయి,
ఆయాసమున తరు
చ్ఛాయలో నాగినది.

"ఇంతలో తాబేలు
ఎచటి కేగునులెమ్ము,
కొంత సే పిచట వి
శ్రాంతి గై కొందు"నని

కుందేలు భావించి
కునుకు తీయుచునుండె.

తాబేలు మాత్రమే
తడబడుచు నడచినది.

దినకరుడు పశ్చిమా
ద్రిని దరిసె మెలమెల్ల,
తెరలుతెరలుగ ఇరులు
పరచుకొనె దెసలెల్ల.

బారుగ బలాకములు
చేరెను కులాయములు.
దర్జాల సింహములు
గర్జిలుచు మేల్కొనెను.

అంత నా కుందేలు
చింతనొందుచు లేచి
చిటికెలోపల నడవి
చివర వర కురికినది.

చేరి చూడగ నచట
తీరుబాటుగ సేద
దీర్చుకొను తాబేలు
కూర్చుండి యుండినది.

తాబేలు కుందేలు
దరికేగి "మిత్రమా!
పందెమే మాయె" నని
పరియాచకమ్మాడె.

♦ ♦ ♦

కార్యదీక్షను బూని
కమఠమ్ము గెలిచినది.
బద్ధకించిన శశము
భంగపా టొందినది.



# చక్కని సలహా

చాలాదినములు మాంసము దొరుకక
డీలా పడినది ఒకనక్క.
బిక్కమొగముతో, బక్కకడుపుతో
డొక్కలుమాడిన ఆనక్క

ఆవురావురని అడవి యంతటా
ఆహారముకై తిరిగినది.
చిట్టచివరకొక చెట్టు తొర్రలో
రొట్టెలు, మాంసము చూచినది.

ఇరుకు తొర్రయని ఆలోచించక
ఉరుకున లోనికి ఎక్కినది.
పొట్ట చెక్కలగు నటుగ అంతా
దిట్టముగా అది మెక్కినది.

పోవుదమనుకొని లేచెనుగానీ
పొట్ట అడ్డమై పోయినది.
వెలుపల పడుటకు మార్గము దొరకక
విలపించుచు కూర్చుండినది.

ఏడుపు వినబడి వేరొక జంబుక
మేమిది యనుకొని వచ్చినది.
చిక్కుపడిన ఆనక్కను చూచీ
చక్కని సలహా ఇచ్చినది.

"నకనకలాడెడు సమయములోనే
చకచక పోతివి లోపలకు.
నకనకలాడెడు నపుడే మళ్ళీ
చకచకరావలె వెలుపలకు."



ఎంత గింజుకొన్నగాని
ఏమి లాభ, మొక్కొకతరి
కాలమహిమవలనె సాను
కూలపడును కార్యమ్ములు.



## దుప్పి కొమ్ములు

దుప్పి యొకటి ఏటికేగి
దప్పితీర నీరుత్రాగి
నీటిలోన ప్రతిఫలించు
నిజరూపము చూచుకొనెను.

చిలవలు పలవలుగ తిరిగి
బలముగ కడు పొదవు పెరిగి
సొంపులీను తనకొమ్ముల
సోయగమ్ముగని మురిసెను.

"చక్కని యీ కొమ్ములుండ
చచ్చుకాళ్ళు దేని"కనుచు
సన్నని తనకాళ్ళు చూచి
కన్నులు చిట్లించుకొనెను.

ఇంతలోన సింహనాద
మెచ్చటిదో వినిపించెను.
ముప్పు కాచుకొనుటకొరకు
దుప్పి యంత పరుగెత్తెను.

కాళ్ళు తేలికైన వగుట
కడు రయమున పొదలు, పుట్ట
లన్నిదాటి, మృగరాజున
కందకుండ పరుగెత్తెను.

అంత నొక్కచోట బాట
కడ్డముగా వ్రాలియున్న
తరు శాఖలలో కొమ్ములు
తగులుకొనగ నాగిపోయె.

గిలగిలమని చాలసేపు
గింజుకొనియె, నింతలోన
సింహమటకు వచ్చి దాని
సంహరించి కబళించెను.

♦ ♦ ♦

"మనవారని నమ్ముకొన్న
జనులొక్కొక పరి శత్రువు
లౌదు రనెడి మంచినీతి
బోధించును మీది గీతి."



## చిలుక - గబ్బిలము

పంజరాన పాపమెట్లో
పట్టుబడిన ఒక చిలుక
రాత్రివేళ మాత్రమె తన
గాత్రమెత్తి పాడెడిది.

సంజ పడినవెనుక లేచి
సంచరించు గబ్బిలము
దీనికేమి కారణమని
తికమకపడె పలుమార్లు.

కడకు చిలుక పంజరమ్ము
కడకు పోయి గబ్బిలము,
"రేయితప్ప పగటివేళ
కూయిడ వే"మని యనెను.

చిలుకయపుడు రెక్కలార్చి
పలికెనిటు నిట్టూర్చి :
"పగటిపూట పాడుటెంత
ప్రమాదమో ఎరుగవా ?

పగటిపూట మేనుమరచి
పాటపాడి నందుకే
వేటగాని చేతజిక్కి
పాటులిన్ని పడినాను.

కావున ఇకమీద పగలు
కంఠమెత్త గూడదని
బాస యొకటి చేసి నోరు
మూసికొంటి మిత్రమా !"

గబ్బిలమ్ము ఇది విని కడు
పుబ్బ నవ్వి ఇట్లనెను :
"ఫలితమేమి లేదుగాని
భలేబాప చేసితివి !

చిలుకలను గురించి వింటి
తెలివితేట లెక్కువని.
తెలిసెనిపుడు నీదు తెలివి
పులుసు కాచుకొనుటకే !

పట్టు ఒడినవెనుక ఇట్టి
గట్టిబాస లెందుకో?
ప్రతిన లెన్ని జేసిన, నీ
బ్రతుకు బాగు పడునొకో?"

♦ ♦ ♦

"చేయి కాల్చుకొని ఆకులు
చేతపట్టు టన్నది
గతజలముల కానకట్ట
కట్టుకొనుట వంటిది."



## జంతువుల సభ

సకలజంతు సంతానముతో
సందడించు సంకులవనమున
సభజేసిన వన్యజంతువులు.

"అసలీ సింహమునకు మనపై
అధికారము నెవరొసంగిరో"
అని మర్కట మొక్కటి పలికెను.

"తమాయించి తర్కించినచో
సమానములు సర్వజీవు"లని
అమాయకపు హరిణము పలికెను.

"నిజము నిజము నీ సిద్ధాంతము
రుజువక్కరలేదు దాని"కని
బుజము లెగురవేసెను ఉష్ట్రము.

"అన్యాయము నరికట్టుటకై
అన్యోన్యముగా మెలగుద"మని
వన్యాశ్వము ప్రతిపాదించెను.

సింహాపు పరిపాలన మికపై
చెల్లదనుచు తీర్మానించెను
చిన్న చిన్న జంతువులన్నియు.

మరునా డీ సభసంగతి విని
సరదాగా నవ్వుచు సింహము
పరిహాసముగా నిటులన్నది :

"ప్రయోజనము శూన్యముగానీ
ప్రసంగములు పసందైనవే!"



## కొదమ సింగము

ఆడసింహ మొకటి
అనుగు బిడ్డతోడ
కొండగుహను కూరు
చుండె నొక్కనాడు.

అంతలోన నచటి
కాడ నక్క యొకటి
వచ్చి దానిజూచి
మచ్చరించి పలికె :

"తడవ కొక్కపిల్ల
తప్ప పెట్టలేవు.
నన్ను జూడు కూన
లెన్నిగలవొ నాకు?"

అంత సింహమనెను :
"అట్టి కొదమసింగ
మొక్కటున్న చాలు,
నక్క లేల వేలు?

వలయునన్న చూప
గలను దీని నిజము"
అనుచు తనదు బిడ్డ
గనుచు సైగచేసె.

పిల్ల సింహ మొక్క
పెట్టు నెగిరి దూక
బిక్కచచ్చి నక్క
పిక్క బలము చూపె.

♦ ♦ ♦

"రాళ్ల గంపెడున్న నేమి?
రత్న మొక్కటైన చాలు,
విలువ కట్టవలయునన్న
తెలియవలయు వస్తుగుణము."



# కుక్క - తోడేలు

"ఎల్ల వేళలందును
ఇల్లు గాచుచుండును"
అనుచు నొక్కకుక్కను
ధనికు డొకడు పెంచెను.

కుక్కమాత్ర మెప్పుడు
ఒక్క చిన్నచప్పుడు
చేయకింటి పంచను
హాయిగ నిదురించును.

తోడేలొకదినమున,
దొంగలాగు మెల్లన
కుక్కకడకు వచ్చెను,
గ్రక్కున పై దూకెను.

కుక్క కదలలేకను
కుక్కిన పేనాయెను.
ముప్పు తప్పు కొనగను
మోసగించ నెంచెను :

"ఆగుము తోడేలా!
అంత తొందరేల?
శరణంటిని గాదా?
కరుణ చూపరాదా?

ఈ యింట వసించుచు,
వేయికండ్ల గాచుచు,
బొ త్తిగ పాడై తిని,
బొమికల గూడై తిని.

ఎంతకష్టపడినను
ఇంతముద్దనై నను
పెట్టడు యజమానుడు,
వట్టి దయాహీనుడు.

అయిన, మరొకవారము
ఆగిన, ఆహారము
కరువుతీర దొరకును;
కడుపునిండ తిందును.

మరొకవార మాగిన
మాఘమాస మందున
పెద్ద ఎత్తుపైనొక
పెండ్లి జరుగుతప్పక.

గాడిపొయ్యి చెంతను
కాపువేసి యుందును.
ఎవరు చూడకుండను
ఎన్నెన్నో తిందును.

తినితిని యా వంటలు
నునుపెక్కును కండలు.
గారెలెన్నొ తిందును,
గాన రుచిగ నుందును.

అపుడు నన్ను బావా!
ఆరగించరావా?"
ఇట్లు కుక్కపలికెను,
వృకము ఆలకించెను.

దాని మనసు కరిగెను
తన వనమున కరిగెను.
వారమైన పిమ్మట
వచ్చిచూడ నచ్చట,

దుక్కలాగు బలిసిన
కుక్క యింటికప్పున
పడుకొని తోడేలును
పరిహసించుచుండెను.

"ఇంటి కప్పుమీదకు
ఎక్కినావు ఎందుకు?
క్రిందికి రమ్మింకను,
తొందరగా తిందును."

అని తోడే లనుటయు
విని పలికెను కుక్కయు;
"మరలవచ్చినావా?
మందబుద్ధి బావా!

ఆదమరచి యుంటిని,
అపుడు పట్టువడితిని.
నీకు మరల చిక్కుట
నీటిమూట దక్కుట!

ఒక్కసారి వదలిన
కుక్క మరల దొరకునః
పొరబడితివి బేలా!
పొమ్మిక తోడేలా!"

కుక్క యిట్లు దురుసుగ
వెక్కిరించి పలుకగ,
తోడేలది విన్నది,
తోకముడిచి చన్నది.

• • • •

"అనుభవమ్మునుండి నేర్చు
కొనవలె గుణపాఠమ్మని
సులభరీతి మంచినీతి
తెలియజేయు మీది గీతి."



## కోతి — ఒంటె

గారడివా డొక కోతిని
గారాబముగా పెంచెను.
నిత్యము శ్రమపడి యా కపి
నృత్యముచేయుట నేర్చెను.

కపివరు డొక్క దినమ్మున
కలకలలాడు వనమ్మున
మెకముల నన్నిటి జేర్చుకు
నొకచో సభ గావించెను.

వానరమంతట సొగసుగ,
వాలము అటు నిటు ఎగురగ,
'ధింతక ధింతక' నృత్యము
సంతసమొప్పగ జేసెను.

మృగములు భళిరా యంచును
నృత్యము నెంతో మెచ్చెను.
వహహా యంచును కోతికి
బహుమతులెన్నో యిచ్చెను.

కోతిని చూచినతోడనె
కుట్టెను కన్నులు ఒంటెకు.
బహుమతులను గొన మదిలో
తహతహ పుట్టెను దానికి.

అంతట నిలబడి తన మెడ
నటునిటు త్రిప్పుచు వెడవెడ
సభికులు వల దనుకొలదిని
రభసముగా నటియించెను.

ఛీదర కలుగుటచేతను
ఛీ యని మెకములు తిట్టెను.
ఛీత్కారములను లొట్టెయు
సత్కారముగా దలచెను.

ఎంతకు నృత్యము మానక
పంతముతో నటియించగ,
తుంటెలు విరిగెడునట్టులు
ఒంటెను బాదెను మృగములు.

♦ ♦ ♦

"ఒరుల కలిమి చూచిమదిని
ఓర్వలేని వార లెపుడు
ఒంటెవలెనె భంగపాడు
నొందుదురని దీని నీతి!"



## తోడేలు - మేకపిల్ల

అంతచక్కని మేకకూన
అదియొకటె ఆ మందలోన;
అంత సొగసగు మేకపిల్ల
అదికాక కలదనుట కల్ల.

పట్టువలె మెత్తనగు మేన
పడి నిలువలేదు ఈగైన;
దాని గన్నంత నెదలోన
దయ గొనును కటికవాడైన.

చెంగునన్ దినము దినమెల్ల
చెంగలించును మేకపిల్ల;
నిముసమే నది లేక తల్లి
నిలువజాలదు బెంగటిల్లి.

ఒకనాడు అది దూరమరిగి,
ఒంటిగా అడవిలో తిరిగి,
దాహమై ఒక్క సెలయేరు
దరిసినది త్రావగా నీరు.

అంత నేతెంచె నొక వృకము;
అతిభీకరము దాని ముఖము;
జల్లుమన తన యుల్లమందు
తల్లడిల్లెను మేకకందు.

తోడేలు దాని జూచుచును,
తూస్కారమున నిట్టులనెను:
"ఎవరోయి, డింభకా! నీవు?
ఇచటి కెందుకు వచ్చినావు?

సెలయేటి నీటి నిటులేల
కెలక లొనరింతువో చాల?
ఎవ్వ రనుకొంటివో నన్ను?
ఏమిచేతునొ చూడు నిన్ను!"

పసిమేక తన తోక డించి,
పలికె, నిలువెల్ల కంపించి:
"నేనుంటి నీయేటి దిగువ;
నీవు నిలిచిన దేటి కెగువ.

నీవున్న దిశనుండి నీరు
నే నున్న తావునకు పారు;
ఎందుకీ రీతి నిందింతు
వేనెట్లు కెలక లొనరింతు?"

"అది సరే, అటు లుండనిమ్ము,
ఇదివిని సమాధాన మిమ్ము:
ఏడాదిక్రింద నను నీవు
ఎందులకు దూషించినావు?"

"ఆర్నెలల పసివాడ నేను,
అది ఎట్లు సంభవమ్మౌను?
పొరబాటు పడితి వనుకొందు,
తెరువిమ్ము ఇలు జేరుకొందు."

ఈరీతి పలుక పసిమేక,
వృకమనెను, అంత బోనీక:
"నిలునిలుము, నీవు గాకున్న
నిందించి యుండు నీయన్న,

అదిగాక, నీతోడవాడు
లాడు ఓపిక నాకులేదు.
తిట్టితివా లేదా నాకేల?
పట్టి నిను తిందు నీవేళ."

తోడనే మరునిమేషమున,
తోడేలు తీవ్రరోషమున,
కడతేర్చి అజ కిశోరమును
కబళించె దాని మాంసమును.

♦ ♦ ♦

"సిగ్గువిడిచి బలహీనుల
కెగ్గుచేయు బలవంతులు
సాకులేవో చెప్పితమ్ము
సమర్థించుకొన జూతురు"



## కోడిపుంజులు

రెండు కోడి పుంజు
లుండె నొక్క యింట;
పెంటిదాని కొరకు
రెంటి కాయె పోరు.

ముక్కులతో పొడిచి
రక్కి, బరికి, కొరికి,
కుక్కుటములు రెండు
అక్కజముగ పోరె.

చివరకొక్క పుంజు
చిత్తు చిత్తు గాను
ఓడి పారిపోయి
గూడులోన దాగె.

గెలిచి నట్టి పుంజు
గేలిచేయు చపుడు
ఇంటి కప్పు మీది
కెక్కి కూయసాగె:

"ఎవ్వరింక నాకు
ఎదురు వచ్చువారు?
దమ్ములున్న రండు,
దుమ్ము చేసివేతు!"

అని సవాలు చేసి,
అతిశయించి పలుక,
గగన మార్గమందు
ఎగురు డేగ వినెను.

కోపగించి డేగ
కోడిపుంజు కడకు
తిన్నగాను వచ్చి
తన్ను కెగిరి పోయె.

అంత, గూట దాగి
చింతనొందు పుంజు
సంతసాన పెంటి
చెంతజేరి నిలిచె.

♦ ♦ ♦

"అహంభావ దుర్గుణమ్ము
అల్పత్వము సూచించును.
వినయముగల బలశాలికె
విజయమెపుడు శోభించును."



## పావురాలు - కాకి

కళల పుట్టిల్లు, కవుల కాణాచి,
సిరి కాట పట్టు సేమాసు దీవి
గ్రీసు దేశమున వాసి కెక్కినది.

ఈ కథల కర్త ఈసపాకనాడు
సేమాసు నగర సీమ నొక చోట
తోటి బానిసలతోటి సభచేసి
కమనీయ ఫణితి కథ చెప్పినాడు:

సంపన్ను నొకని సదనమ్మునందు
పావురము లుండు పంజరము కలదు.
తెల్లనివి, మరియు నల్లనివి, మరియు
పలువన్నెలీను పారావతాలు
అందు నివసించి అందాలు విరియు.

పంజరపు టపరంజి ఘంటికలు
గాలి తాకునకు ఘలు ఘల్లు మనగ
గారవము మీర ఆ రవము వినుచు
కలరవము లన్ని అలరెడివి మదిని,

ఆ గుంపులోన అతి వృద్ధయైన
పావుర మ్మొకటి పలికె నీరీతి
తనవారినెల్ల గనుచు సంప్రీతి:

"యజమానివంటి సుజనుండులేడు.
ఆశ్రితుల కతడు అఖిల సుఖదాత.
పావురపుజాతి దేవుడనజాలు
యజమాని కెపుడు విజయమౌగాత!

ప్రభుదయకు మనము పాత్రులముగాన
ఏగోడులేక ఈ గూడులోన
హాయిగా నుంటి మందరము కలసి.
ఇది లేకయున్న ఎన్నెన్ని ఇడుమ
లొందువారలమొ యోజింపుడయ్య.

దినదినమ్మిట్లు మన సంఖ్య పెరిగి
అభివృద్ధియౌట ఆనంద మౌను.
ఈవిధముగానె పావురపుజాతి
దినదినమునకు వృద్ధి గనగోరుచుందు."

ఈరీతి ముసలి పారాయి పలుక
వాయసమ్మొకటి ఆ యుపన్యాస
మంతయును వినుచు అపహసించినది:

"పంజరములోని పావురములార:
చింతించుబదులు సంతసించెదరు;
స్వేచ్ఛ నరికట్టు తుచ్ఛ పంజరము
చూచుకొని ఇట్లు చొక్కెదరు మీరు.

రోజురోజునకు మీజాతి సంఖ్య
వృద్ధియగుకొలది బద్ధులగువార
లెక్కువగుచుంట నిక్కువము గాదె?

బానిసతనమ్ము పోనడచు బదులు,
స్వాతంత్ర్య మెటులొ సాధించుబదులు
పరతంత్రులయ్యు పంజరపు బ్రదుకు
ప్రేమింతు రహహా! ఏమందుమిమ్ము,"
అని వాయసమ్ము తనదారి నేగె.

పావురములంత పరవశ్య మాని
తమ తప్పు తెలిసి తల వంచుకొనెను.



## పులి - తోడేలు

చీకటి రాతిరి తోడేలు
మేకల మందను జొచ్చినది.
అందొక దానిని పట్టుకొని
తొందరగా పరుగెత్తినది.

కానన మందున జనుచుండ
దానిని బెబ్బులి చూచినది.
భయమున వణకుచు తోడేలు
రయమున మేకను వదలినది.

వ్యాఘ్రము మేకను తీసుకొని
శీఘ్రముగా పోబోయినది.
వృకమా బెబ్బులి వెంటబడి
వినయముగానే పలికినది:

"మీకిది తగునా పులిరాజా!
మేకను శ్రమపడి తెచ్చితిని.
ఇతరుల సొత్తును ఈరీతి
ఎత్తుక పోవుట అక్రమము."

వికవిక నవ్వుచు పెద్దపులి
వృకమును గని ఇటు లాడినది:
"న్యాయా న్యాయము లెంచుటకు
న్యాయా ర్జితమా ఈ మేక?

ఇతరుల దోపిడి చేయకను
బ్రతికెడి దెట్లులు మనబోంట్లు?
నీతుల నెందుకు పలికెదవు
నీవూ నేనూ దొంగలమె!"

ఇది విని సిగ్గున తోడేలు
బదులాడక వెనుదిరిగినది.
శార్దూలము ఆ మేషమును
నిర్దయగా కబళించినది.

* * *

"రాజ్యమ్ములు ఆయుధబల
భోజ్యములై యుండెడి ఈ
ధరణీ తలమందు నేడు
దొరలెవ్వరు, దొంగలెవరు?"



## కప్ప - సింహము

తటాక నిర్మలోదకమ్ము త్రావ, సింహమొండు, వే
హుటాహుటిన్ గమించి, చెర్వు ఒడ్డు జేరి నిల్వగా
తటాననున్న రంధ్రమందు దాగియున్న కప్పయున్
చటాలునన్ బెకాబెకంచు సవ్వడించె నల్లనన్.

"ఇదేదియో మహోమృగమ్ము, ఏమి సేయువాడ, హృ
ద్విదారకమ్ముగా ధ్వనించె, దీనినె ట్లెదుర్తునో
గదా"యనెంచు సింహరాజు గాంచి కప్పయున్ మదిన్
మదమ్ము రెచ్చి, పైకివచ్చి, నవ్వుచున్ నిలంబడెన్.

హసించుచున్న దర్దురమ్ము నబ్బురాన గాంచుచున్
"ఇసీ ననున్ వనాధినాథు నింతయల్ప జంతువా
హసించి భీతిలంగజేయు" టంచు.సింహమాగ్రహిం
చి, సత్వరన్ గ్రహించి చించి చెండి వైచె భేకమున్

♦ ♦ ♦

"పోరు చేతకానివారు
కారుకూత లరచు రెండు
కన్న నీతి తెలుపుటకీ
చిన్న గాథ పనికివచ్చు."



## హ ం స గీ త ం

అంచలకు మధురమ్ము లైన కంఠములుండు
నంచు వేమారు విన్నట్టి యొక పౌరుండు,
విపణి వీథికి పోయి, విలిచె కడు వెలయిచ్చి
అపురూప రూపయగు హంసగని మది మెచ్చి.

మందార వనమందు మధ్య కేళాకూళి
నందాల రాయంచ అలవోకగా తేలి,
తెలి తామరల నడుమ తెలి తామరనిపించు,
నెలవంక నీటిలో నిలుచుండె ననిపించు.

కతిపయదినాలిట్లు గడువ నొక చెలికాడు
అతిథియై ఆ యింటి కరుదెంచె నొకనాడు.
మృష్టాన్నమిడి ఆదరించె మిత్రుని గేస్తు;
హృష్టుడై మధువాని త్రేన్చినాడా నేస్తు.

పిదప యజమాని రావించి తన రాయంచఁ
"బదమొకటి హాయిగా పాడు" మని యర్థించ,
నోరు మెదపక, మూగనోము పట్టెనొ గాని,
మారాడదాయె పలు మారు లడిగిన గాని.

అదిచూచి వెకిలిగా అతిథి నవ్వుచు జనెను;
మది నొచ్చుకున్న యజమాని కడు సిగ్గిలెను.
అదలించి బెదరించి యత డూరకొనె విసిగి,
పెదవి విప్పక హంస భీతిల్లె నొదిగొదిగి.

కొంతకాలము గడువ, కొలనిలో హంసకును
అంతకాలము ప్రాప్తమయ్యె విధివశమునను.
అంతనా రాయంచ అమృతగళ మెత్తినది;
వింతగా, వీనులకు విందుగా పాడినది.

ఖేద మోదములు సంకీర్ణమై, నాదనది
రోదోంతరము నిండి మ్రోయగా పాడినది.
రాలు కరగించు మధుర మరాళ గానమ్ము
గాలి దేలగ, మిగిలె, కడలేని మౌనమ్ము.

గృహగవాక్షమునుండి గృహమేధి పాటవిని,
గ్రహియించె, జాలి జాలై వారగా మదిని;
"సాజముగ హంస యవసానమున పాడు" నని,
నైజగుణములు మాన్ప నరు లేరునేర" రని.
(హంస మరణం సమీపించిందని తెలిసి నపుడు
గానం చేస్తుందని గ్రీకుల నమ్మకం.)

♦ ♦ ♦

"కావ్య కళయు, చిత్రకళయు,
శ్రావ్యమైన గానకళయు,
అవ్యాజము లైనపుడే
అవ్యయమ్ములగుచు వెలయు."



## నదులు - సముద్రుడు

సమస్త లోకపు నదీ నదమ్ములు
సముద్ర తటమున నొకచోటన్
సమావేశమై ఒకే మాటగా
సముద్రు నిట్టులు నిందించెన్:

"ఘనా ఘనమ్ముల పయోధారలఁ
జనించి గిరులన్ భ్రమింతుము;
జనాళికోసము జగాన నెల్లెడ
అనారతముగా చరింతుము.

నిదాఘ వేళల విదాహు లెల్లరు
ముదాన మా జలమానుదురు;
నదీ జలమ్ములు సుధాసమములని
సదా నుతింతురు మానవులు.

నిరంతరముగా విశుద్ధ జలములు
పరిగ్రహింతువు మానుండి.
పరిగ్రహించిన క్షణాన వానిని
అరుచ్యములుగా చేయుదువు.

వనుల్ దాటుకొని, గిరుల్ చూటుకొని,
నినుంజేర పరతెంచెద మే!
వినిర్మలోదకములన్ కషాయము
లొనర్చుచేనా నీ న్యాయం?"

ఇదంతయున్ విని సముద్రుడప్పుడు
నదీ నదమ్ముల కిట్లనియెన్:
"మదీయ జలములు పరిగ్రహించియె
గదా! మేఘములు మీకిచ్చున్?

జలాల మలినము లొనర్తునంచును
ప్రలాపింతురే నదులారా!
బలా! బలా! మిము ననున్ జేరుడని
బలాత్కార మొనరించితినా?

సుధా మధురములు భవత్తోయములు
యథార్థముగ మలినమ్మగుచో,
యథేచ్ఛనిపుడే తిరోగమించుడు
వృథా వివాదము లెందులకో?"

జవాబు విని, మరి సవాలువిని, యా
స్రవంతు లెంతయు లజ్జించెన్.

ప్రవాహ నైజము అవార్యమగుటన్
ప్రవేశించినవి సాగరమున్.

♦ ♦ ♦

"నిజముగ మన హితము గోరు
సుజనుల నిర్హేతుకముగ
నిందించెడి మందమతుల
మందలించు నీ గీతము."



## పికిలిపిట్ట - డేగ

చిన్న పికిలి పిట్ట చెట్టుపై కూర్చుండి
సన్న నెలుగు తోడ సన్నాయి వలె పాడ,
విన్న డేగ యొకటి వెంటనే దిగివచ్చి
తన్ను కెగిరి పోయె తన కాళ్ళతో పట్టి.

పాటనాపి పిట్ట ప్రార్థించె నీ భంగి:
"ఏటికోయి నన్ను హింస పెట్టెదవిటు?
సాటి పక్షినన్ను జాలి కొంచెము చూపి
గూటి కడకు మరల గొంపోయి విడుమోయి!

నాకుచూడ చిన్న నలుసంత కాయమ్ము,
ఆకలైన తీరదయ్య,నన్ను భుజింప.
నీకు పొట్టమిగుల నిండిపోవలెనన్న
కాకి నొకటి పట్టి కమ్మగా తినవోయి!"

అంత డేగ నవ్వి యాచిన్న పిట్టతో
"ఎంత వెర్రిదానవే బుల్బులీ! భళీ!
చెంతనున్న పిట్ట చిన్నదే కానిమ్ము,
పొంతలేని పెద్ద పులుగుకంటెను మిన్న.

దొరకనట్టిది ఎంత దొడ్డదైనను గాని
దొరికినట్టిదాని దొరగిపోదునె" యంచు
కరకుకత్తివంటి కఠిన తుండము తోడ
కొరికి కడుపు నింపుకొనిపోయె తనదారి.

♦ ♦ ♦

"లభియింపని దానికొరకు
లభియించినదాని వదలు
కొనుట వట్టివె్రితనము
అని తెలుపును ఈ గీతము."



## చిలుక - పిల్లి

మచ్చికైన చిలుకను కొని
తెచ్చినట్టి పౌరు డొకడు
ఇచ్చ వచ్చినట్లు తిరుగ
నిచ్చె దాని నింటిలోన.

పచ్చని తన రెక్కలార్చి
నిచ్చలు రాచిలుక ముదము
హెచ్చగ నా యింటిలోన
విచ్చల విడి విహరించును.

చిలుక ఎపుడు చూచిన సరి
చిలుక కొయ్య మీదికెగిరి
కిల కిల మని కులుకుచుండు
కలరవమున పలుకుచుండు.

ఇంటి నుండి మింటికెగిరి,
మింటి నుండి మంటికి దిగి
ఒంటరిగా కూరుచుండి
తుంటరి వలె గోలచేయు.

ఎలుకలకొరకెల్లప్పుడు
కలుగుల కడ తిరుగు పిల్లి
చిలుక తీరు, చిలుక జోరు
పలుమారులు పరికించెను.

ఎట్టులైన నాచిలుకను
గుట్టు చప్పు డవనిరీతి
పట్టిపైచి మట్టు పెట్టి
పొట్ట నింపుకో నెంచెను.

తెలివి గలది యగుటచేత
చిలుక దాని ఎత్తు లెరిగి,
మెలకువతో దూరముగా
తొలగి తొలగి తిరుగుచుండు.

ఒక్కనాడు మార్జాలము
అక్కసు నిక పట్టలేక
మిక్కుటమగు నాగ్రహమున
నిక్కరణిని చిలుక నడిగె :

"ఎక్కడిదానవె చిలుకా!
ఇక్కడి కెటు వచ్చితివే?
టక్కులాడి వోలె ఇంట
తక్కి తారు చున్నావే?"

కల కల నగి నిర్భయముగ
చిలుక పలికె పిల్లితోడ :
"నెల క్రితమే యజమానుడు
విలిచె నన్ను సంతలోన."

"సరి సరి అదియా నీ కత?
పరదేశపు చిలుక వయ్యు,
వెరపు లేక అ స్తమాన
మరచుచుంటి వింటిలోన.

ఇచ్చటనే పుట్టి పెరిగి
ఇచ్చటనే ఉన్న నాకు
ఇచ్చ వచ్చినట్లు తిరుగు
స్వేచ్ఛ లేదు ఈ గృహమున.

ఇన్నాళ్లుగ ఇల్లు కాచు
కున్న నేను మ్యావు మ్యావు
మన్న చాలు మండి పడుచు
తన్ని పంపు యజమానుడు.

నిన్న మొన్న వచ్చినట్టి
నిన్ను కొంచె మదలించక
చిన్ననాటి నుండి యున్న
న న్నదల్చు టేమి నీతి?"

అంత చిలుక అన్నదిట్లు :
"శాంతించుము పిల్లి బావ!
ఇంతమాత్ర మెరుగవ, నీ
గొంతు కేడ్చినట్టులుండు.

నీవు మ్యావుమనుట వినుట
కేవగించుకొనును గాని,
నా వాక్కుల నతడు ప్రీతి
తో విని యానందించును.

మన కిరువురి కిదె భేదము,
కనుక నీవు ఇల్లు విడిచి
చనుట యొకటె గత్యంతర"
మని సలహా చెప్పినది.

# ఒ ప్పు ల ప ట్టి క

ఈ పుస్తకంలో అచ్చుతప్పులు కూడా లేకపోలేదు. వాటిని ఈ క్రిందివిధంగా సవరించుకొన వలెనని రచయిత మనవి.

| పేజీ | పంక్తి | ఒప్పు |
|---|---|---|
| 6 | 10 | జేరి చెప్పు నతడు కథలు |
| 7 | 4 | దేనెలట్లు దాగియుండు |
| 19 | 6 | నేను ముందు నీరు త్రాగవలెను |
| 30 | 3 | గట్లు తెగెను |
| 30 | 4 | చెట్లు పడెను |
| 33 | 17 | లోకమ్మే |
| 44 | 2 | పరుగెత్తు కుందేలు |
| 48 | 3 | బక్క కడుపుతో |
| 49 | 7 | పొట్ట చెక్కలగునట్టుగ అంతా |
| 55 | 6 | పలికె నిట్లు నిట్టూర్చి |
| 64 | 14 | అంత లొంపరేలా |
| 71 | 15 | ఒంటె వలెనె భంగపాటు |
| 81 | 6 | పంజరంపు టపరంజి ఘంటికలు |
| 82 | 9 | దినదినము వృద్ధిగన గోరుచుండు |
| 86 | 2 | బ్రతికెడిదెట్టులు మనబోంట్లు |
| 96 | 1 | ....చెట్టుపై కూర్చుండి |

KATHAGEYA SUDHANIDHI 1-75

| | | |
|---|---|---|
| పల్లెవాసి | కొసరాజు శేషయ్య | 3-50 |
| పంకజం | ,, | 3-50 |
| బోడెమ్మ బ్రతుకు | ,, | 3-50 |
| ముళ్ళగులాబి | కె. చిరంజీవి | 3-50 |
| రేపటిదారి | శంకరమంచి | 3-00 |
| అందని ఆనందం | పరుచూరి | 4-00 |
| జీవనమాధుర్యం | మునిపల్లె సరోజనిదేవి | 5-00 |
| ధన్యజీవులు | కొత్త లక్ష్మీరఘురాం | 2-00 |
| కూలిన శిఖరాలు | "అమరేంద్ర" | 2-00 |
| మయూరకన్య | సండూరి రామమోహనరావు | 1-50 |

నవీనగ్రంథమాల - విజయవాడ-2

TITLE PRINTED AT VIJAYA PRESS, VJA-2.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | RSK01H109 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 4/07/23 |
| ముందు అట్ట | ఉంది |
| వెనుక అట్ట | ఉంది |
| మొత్తం పేజీలు | 109 |
| పెద్ద సైజు పేజీలు | లేవు |
| ఖాళీ పేజీలు | 105, C.P, |
| లేని పేజీలు | లేవు |
| తయారు చేసినది | Lakshmi |
| పేజీలు విడదీసినది | Lakshmi |
| స్కాన్ చేసినది | Ramya |
| పరీక్ష చేసినది | Prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | |
| పరిస్థితి | |